ఓం.

శ్రీ ఉమామహేశ్వరాయనమః.

# సాంబశతకము



ఇది

వఝట్లూరు కోటయాహ్వా[illegible]ధిచే

రచియింపఁబడియె.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

 1931 వెల 0—1—0

# సాంబశతకము

ooooOOoooo

శ్రీ కరుణాకరధీర ది
వాకర శశివహ్ని నేత్ర హరిసన్మిత్రా
నాకస్తుత సంతతము
లోకస్తుత దివ్యఫాలలోచన సాంబా॥ 1

ధీవరులకు కవివరులకు
సేవందనమాచరించి నీపైకృతినీ
యేవిరచింపగ బూనియు
భావంబుననిడితి నీదెభారము సాంబా ॥ 2

గణములు ప్రాసలు యతి ల
క్షణములు పదదోషములును సత్కార్యము లా
ఫణితి నెరుంగను నెట్టిదొ
ప్రణుతించితిగాని నీదెభారము సాంబా ॥ 3

శ్రీ గౌరీహృదయేశ్వర
వాగీశప్రముఖచక్రవందితచరణా
భోగీశాకర కంకణ
యోగీహృదయావిహారయున్నత సాంబా ॥ 4

ఏమోయి భక్తవరదా
కామితములునివ్వ నీకు గాంక్షయులేదా
నీ మృదుపదములు నమ్మితి
స్వామీ నన్నెట్టులైన సాకుము సాంబా ॥ 5

మత్తేభవరద వినుతా
చిత్తజసంహార సుగుణశీల విలోలా
మత్తుఁడనై తిని నీదగు
బత్తిని నాకొసగుమయ్య బాగుగ సాంబా ॥ 6

త్రిభువనముల పోషించెడి
ప్రభుడవు సర్వేశ్వరుడవు పరమేశ్వర నా
కభయమొసంగవదేమిర
విభవమునకుఁ గాదె నిన్ను వేడుట సాంబా ॥ 7

నను బ్రోవరార భక్తా
ళిని బ్రోచిన బిరుదుగాదు లేరా లేవ
హానభూషయింక జాగే
లనురా నినునమ్మినార లాలిత సాంబా ॥ 8

మ్రొక్కఁగ వరమీయుటకుఁ
ముక్కంటీ నీకుఁ జూడ ముజ్జగములలో
నొక్కండు గలడె వెదకిన
నక్కజముగ వేల్పులందు నహహా సాంబా ॥ 9

మృత్యుంజయ యనునామ మ
నిత్యులు వచియించినారు నీవే నిజమా
మృత్యువును గెల్చినావని
యత్యద్భుతమయ్యె నీమహత్యము సాంబా ॥ 10

అత్తరి భగీరథుండను
నుత్తము డలగంగ నెంచి యుర్వీస్థలికిన్
బత్తితో దెచ్చెడి గంగను
నెత్తిన ధరియించితౌర నేర్పునసాంబా ॥ 11

ఏమిఘనమయ్య నీకిది
భామల నెడదాల్చినావు భగవంతుడవౌ
స్వాముల కెల్లను సామివె
భూమిని నినుబొగడవశమె బుధనుతసాంబా ॥ 12

శాపములగాల్చిన బూడిద
సవిశేషముగ దేహమందు నలదెద వౌరా
భవుడా మలయజముండగ
నవురా నీకిట్టి సౌఖ్యమబ్బెనుసాంబా ॥ 13

దారిద్రుడవని యందురు
ధారుణిగలజనులు తారతమ్యమెరుగక
కోరిన భక్తాగ్రేసరు
లేరీతిని నెగడుచుండ్రి యెరుగరుసాంబా ॥ 14

చరితము లెన్నియొనర్చిన
చిరకాలము మరపులేక జెలగెడిమతితో
ధరణి నిను గొల్చువారికి
యరుదా కైవల్యపదవి నబ్బుటసాంబా ॥ 15

ఇమ్మగ సత్కవిపాలిటి
సొమ్మువుమరిగాక నీదు సుతుడుగణేశుం
డమ్మహనీయుడు మాదగు
సొమ్మగద నీవుమాకు సులభముసాంబా ॥ 16

రుద్రాక్షలు విభూతియు
భద్రముగధరించి నీదుభక్తుడనై నా
క్షుద్రము బాపుమటంటిని
రుద్రాయమునికినిజంకి గూషిగసాంబా ॥ 17

చేసెదనింకను నీనిజ
దాసులసహవాస మబ్బుదాకను నిత్యా
భ్యాసముజేసెదనల కై
లాసము వీక్షించుకోరిక ప్రాప్తముసాంబా ॥ 18

మొన్నగ కాలుని మాతల
దన్నితివరకాలసర్వదా నినుగొల్వన్
మున్నామార్కండేయుని
పున్నెముబొగడంగవశమె పుడమినిసాంబా ॥ 19

కృత్తివసనుగక తొల్లిట
రాత్రించరుకభయమివ్వ రక్కసుడంతన్
పాత్రత దెలియక నీకే
శత్రుండయె నెంతవింత జరిగెనుసాంబా ॥ 20

నిత్యము నృత్యము జేయుచు
నిత్యానందమున నుండు నిష్కపటినటా
సత్యము శాంతము ధర్మము
నిత్యము నీ నియతియట గిరీశా సాంబా ॥ 26

ఒక్కటి శాంతము మరియుం
గొక్కటి ధర్మంబు నిజము పుష్కలగుణముల్
లెక్కగొను నాతడిలలో
నిక్కముగా సదయువాడు నీవే సాంబా ॥ 27

పరకాంతలగని వలచితి
పరధనముల కాసపడితి పాపుడనైతీ
కొరగానివాడనైతీ
పురహర నను గావు నీకు పుణ్యము సాంబా ॥ 28

నిగమములు నీవు నీవే
నిగమంబులటంచు విబుధనికము తెలుపఁ
దగుమవటంచును నను గా
వగ నీదరిజేరినాడ బాగుగ సాంబా ॥ 29

క్రతువులు వ్రతములు దానము
లతులితపుణ్యములు తీర్థయాత్రలు సలుపఁ
సతతము నినుభజియించెడి
మతిమంతుల సాటిగలరె మహిలో సాంబా ॥ 30

మన్ననమర్యాదెరుగక
పిన్నలపెద్దలను వెతలుబెట్టితి బహుగా
మన్నింపుమునీబిడ్డడ
నన్నాపెరవానిరీతి నరయకసాంబా ॥ 31

బుద్ధిని నిల్పియుసతతము
శ్రద్ధగపఠియించి నీదుస్తవమొనరింపన్
బద్ధుడవౌదట భక్తుల
పదను వసియించినెప్డు వదలకసాంబా ॥ 32

జననీ జనకుడనీవే
ఘనగురుడవు నన్ను బ్రోచుకర్తవునీవే
యనియెడి యాశలుగొంటిని
నినునమ్మిమనంబులోన నిజముగసాంబా ॥ 33

నిటలాక్షుభక్తరక్షా
కుటిలజనావ్రాతశిక్షకోవిదుపక్షా
దిటవుగనీపైదీక్షా
పటుతరముగనిల్పినాడ భక్తితొసాంబా ॥ 34

భక్తులవిముక్తిజేయగ
శక్తియునీయందెగలదు సర్వమునీవే
ముక్తినొసంగెద వందురు
భక్తాగ్రేసరులు పెక్కుభంగులసాంబా ॥ 35

దుర్గాప్రియవల్లభ యో
స్వర్గాధిపవంద్య నిన్ను సతము భజింపన్
భార్గవు డెంతటిపుణ్యుడొ
భర్గా నినుగొల్చిగాదె వరలుటసాంబా ॥ 36

ఆగ్రముమాని వినుమిక
నుగ్రుడవని జడియ నొక్క నుక్తియు దొరకెన్
నుగ్రాయా పంచేంద్రియ
నిగ్రహులగు వారిచెంతి నిలచెదసాంబా ॥ 37

కరిమోమట నీసుతునిది
కరిచర్మము నీవు పయిని గప్పెదవట నీ
విరతము నెక్కెడి పెద్దట
పరిహాసముగాదె యిట్టి పనులిలసాంబా ॥ 38

తిట్టినదిట్టవు పదపడి
కొట్టెదనన కొట్టరావు కోరినకోర్కుల్
నెట్టువుయిడనని భక్తుల
పట్టుననెపుడుందువహహా బాగుగసాంబా ॥ 39

అక్కట పశ్రిమదగనాంబుల
జిక్కియు మరి దాసజనుల సేమములెన్నన్
మక్కువమరచితివాయిటు
గ్రక్కున రాగదెవెనన్న గావగసాంబా ॥ 40

శాశ్వతమగు ఈశ్వరుడవు
విశ్వము సృష్టించినావు వేయేలనభో
గీశ్వర భూషణనాపై
విశ్వాసము నుంచుమయ్య విమలకసాంబా ॥ 41

జంగమలింగయనంగవి
భంగాకరుణాకరంగ భవహరలింగా
శృంగారగాత్రయాకస
గంగజటాఝూట కాలకంఠసాంబా ॥ 42

మారీతి నీదగుభక్తుల
మీరీతి గురునాజ్ఞబుధుల మిగలితినే ము
చ్చాదినిమూలెన్నో దెలియక
యేరీతిని నన్ను బ్రోవ నెంతువొసాంబా ॥ 43

కుశలముగనున్నదినముల
పశమూపట్టంగనరుల వలదప్పినచో
పశుపతి బ్రోవుమటందురు
దశదోలగిననాడు నీ నైదాతవుసాంబా ॥ 44

స్వామీ యాపదబాపుము
యేమెరుగమటంచు మ్రొక్కులిడి యాపిదపన్
నీమహిమమెన్ను భక్తుల
మోమరసియు నవ్వుచుంద్రు పుడమినిసాంబా ॥ 45

నేఁచినేరకయును మది
పారాయణఁజేతునీదు పఠనము శంభో
మారాడవలదు రమ్మిక
గోరాధ్వాహన ఘనంబుగోరితిసాంబా ॥ 46

ఆసకు నిల్కడగలదా
నీసేవకు మితముగలద నిరతముగొల్వన్
దాసులకు ఘనతగలదా
కాసులపై నీకుప్రేమగలదాసాంబా ॥ 47

ఉన్నది తినుటకునన్నము
వున్నవి ధరియింపవస్త్రములు దలపంగా
నన్నియునీదగుభక్తికి
నున్నగదా లేదుఫలము నుంతయుసాంబా ॥ 48

ఒడలెరుగక నీదాసుల
గడుదూషణఁజేయుఖలుడు కాలునిపురిలో
వడిగల రంపపుకోతల
బడుటది నిక్కంబుగాదె భవహరసాంబా ॥ 49

పెట్టుమని యడుగుబీదల
దిట్టెడి కొట్టెడిఖలుండు దినకరుసుతుచే
నెట్టింపఁగాగు నూనెల
తొట్టియలందునను బడగఁద్రోతురుసాంబా ॥ 50

దేవుడు యీశుడుగాడని
కేవలముగ బల్కువాడు కింకర గదలన్
లేవగనీయక బోదుతురు
కైవల్యము బండిసున్నగాగను సాంబా॥ 51

ఆడుచు పాడుచు నీ గతి
వేడుకలను జేయుచున్ నవీనముగాగన్
వాడుపది పాడుచుండిన
నాడే నిను జేరుతుదకు బాగుగ సాంబా 52

క్రొవ్వున నిను నుతియింపక
కోవ్వగ దాసులకు బాధలొనరించుచుండ్రల్
నెవ్విధి మోక్షముగాని వా
రవ్వాల దరియించుటెటులో నరయగ సాంబా॥ 53

వరముల నిచ్చెదవో రా
యురమరలేకుండ నెట్టి యుద్ధమునకైనన్
పరిపరి నినుభజియించితి
పురహరనను గావవేల పుత్రుని సాంబా॥ 54

పాండవమధ్యముతోడను
భండనమొనరించి వాని బాహుబలంబున్
కొండంతగగని వానికి
పండుగ నొసగితివి పాశుపతమును సాంబా॥ 55

దాగితివా నను బ్రోవగ
యోగులహృదయంబునందు నున్నతశక్తిన్
నాగోలకు జంకితివా
త్యాగివి మరి గావలేద దర్పము సాంబా ॥ 56

సతతము నీదగు నామము
స్తుతియించెడి మతియులేదు జూడగ నాకే
గతులునొనర్తువొ నాదగు
బ్రతుకెట్టులొ దెలియ పతితపావన సాంబా ॥ 57

నిను గాంచలేనికన్నులు
నిను నొకతూరియు భజింపనేరని జిహ్వా
నిను విననట్టియు వీనులు
ఘనముగవినియుండి యేమిఘనముర సాంబా॥ 58

పురహర సర్వేశ పరా
త్పరయని నిను దలపనట్టి పాపులు ధరలో
ఖరకరు సత్పుత్రునిచే
కరపాదంబులు వధింపగందురు సాంబా ॥ 59

ఒకసారి నీదునామము
ప్రకటితముగదలచువాడు భక్తుడుయనుచుం
ద్రికనెల్లవేళలందున
మొకమోటములేక గొలువబూనితి సాంబా ॥ 50

భిక్షాం దేహీయని నే
మోక్షముకు నీదుపాదములు శిరమందున్
దీక్షతో నిల్పి భజించితి
రక్షింపుమునన్ను భక్తరక్షకసాంబా ॥ 61

అందర కవులకు నీదుసు
తుందును మరియునీదుసతియు నున్నతగౌరీ
కొందరభక్తులయెడనీ
వుండెదవుర వెనుకముందు నోర్చియుసాంబా ॥ 62

తనయులొనర్చెడు తప్పులు
జనకులు మన్నింతురవని సర్వేశ్వర నీ
తనయుడ ననుబ్రోవర పా
వనచరితా సుగుణభక్తవత్సలసాంబా ॥ 63

ఎంత దురాదృష్టుండనో
సుంతయు బొడగానరావు చూడ్కులకెదుటన్
పంతమునాతో భక్తుల
స్వాంతమునందుందువందు సగుణులుసాంబా ॥ 64

కులమేటికి స్థలమేటికి
బలమేటికి దలపనీదుభక్తియెనర్పన్
కొలదిదినంబులలోపల
దిలకించుర నీదుదివ్యతేజముసాంబా ! 65

పెక్కండ్రబోధించువారికి
లెక్కానేనొక్కరుండ లిప్సలొసంగ
గ్రక్కునబ్రోవరయేనిం
కెక్కడికేగెదను దారియేదిరసాంబా ॥ 66

ఘోరసంసారమనియెడి
పారావారమున మునిగిపాపుడనైతిగ
రారమ్ముతేల్చనీదే
భారము రాయింక భక్తవత్సలసాంబా ॥ 67

ఫాలాక్షానీపదములు
చాలగభజియించునట్టి సద్భక్తులయా
పాలనలో ననుగొనుమిక
మేలునుమఱిగలుగునీకు మిక్కిలిసాంబా ॥ 68

ఓయిమిన్వ్యాకదాల్పా
నాయిడుములు బారదోలి నన్నేలుము య
న్యాయంబేమియొనర్చితి
నీయెడ యీయెడను దెల్పు నిజముగసాంబా ॥ 69

లోకేశ్వమివ్వబూనకు
దాకొనుకొమ్మివ్వలోన దలపకుమయ్యా
నీకగు బిరుదుకుభిన్నము
రాకుండునె యింక భక్తరక్షకసాంబా ॥ 70

ఎట్టికడురోగములకును
దిట్టపుయౌషధము నీదుదివ్యపదంబుల్
బట్టితివిడువక ననుయిక
నట్టేటనుముంచకయ్య నగపురసాంబా ॥ 71

కడుకష్టంబులుబెట్టక
చెడుగుణముల జేరనీక చిత్తముమరినీ
యడుగుల నిలువగజేయుము
విడయక నీదాసులకును దాసుడసాంబా ॥ 72

లోకులసిరులకునేడ్వక
లోకులహింసింపమనసులోదలపక సు
శ్లోకుని ననుజేయుము ము
ల్లోకేశ్వర శైలజాతలోలాసాంబా ॥ 73

నాపిల్లలు నాపెండ్లము
నాపాడియు నాదుపంట నాయిల్లంచున్
వాపోవుచుండ్రు మర్త్యులు
నీపైయింకెప్డు భక్తినేర్తురుసాంబా ॥ 74

తనసంతతి తనభాగ్యము
తనసౌఖ్యము తనదుఠీవి తనభోగంబుల్
తనమురిపెమె సరిపోయెను
నినునెప్పుడు గొల్చువాడు నియతిగసాంబా ॥ 75

ధనమున్న నాడె ధన్యుడ
నని బొంగుచునుండువాడు నవనీస్థలిలో
ధనమున నిన్ను నెఱుంగడు
ధనవంతుని నెటులబ్రోవదలతువో సాంబా ॥ 76

కూళులయి మిగుల శతవ
ర్షాలపనిని బ్రతుకనేమి లాభముగననే
నాలుగురోజులు బ్రతికిన
చాలదె నినుగొల్చునట్టి సగుణుడు సాంబా ॥ 77

దలపగ మూతినమీసము
మొలచినమాత్రమునవాడు పూరుషుడగునా
కొలిచెడి యువతులకిష్టని
ఖలునకు మీసంబదేల కాల్చనసాంబా ॥ 78

పతిమాట విననిపడతియు
క్షితిలో గురువులనుదూరుశిష్యులు నాస్త్ర
స్తుతిచేమెలగెడు మనుజుం
డతులిత పాపములకెల్ల నర్హుడె సాంబా ॥ 79

కుడుచుటకు లేనివానికి
కొడుకులు బహుమందిజూడ కోటీసునకున్
నిడవొక్క పుత్రునైనను
కడుచిత్రము నీదుమహిమ గాంచగసాంబా ॥ 80

సుందరిమైనను దన సతి
యందు కటాక్షంబుగలుగదాయె పరస్త్రీ
యందున మనంబునిల్పుదు
రిందుధరా వారినెటుల నేలెదొసాంబా ॥ 81

పనిబడి సంసారాబ్ధిని
మునిగియు దేలుచును పొంగిపొరలుచు నరకం
బున బడజూతురు నియతిగ
నినుగొల్వగ జాలరొకొ నిజముసముసాంబా ॥ 82

ఎన్నిశతకోట్ల విత్తం
బున్నను మరివిత్తవీగు చున్ననుగానీ
సున్నగదా నీభక్తికి
మిన్నగలదె యెద్దియేని మేదినిసాంబా ॥ 83

ఉదయమునలేచి నీదగు
పదముల భజియింప నెట్టి పాతకుడైనన్
ముదమొప్ప నిన్ను జేరుట
తుదకరుదా కల్మషంబు దొలగియుసాంబా ॥ 84

చారెడునేత్రము మీసము
బారెడురూపంబు బాహుబలుడై యున్నన్
ధారుణి నినుభజియింపని
వారికి కైవల్యమెట్లు వచ్చుర సాంబా ॥ 85

ఎంతటి మొనగాడైనను
కాంతకు దాసుండెసుమ్ము కవివరుడైనన్
స్వాంతమున దలచిచూడగ
యంతయు నీమహిమగాదె యువసనిసాంబా ॥ 86

ఎప్పటికైనను చావక
తప్పదుమానవులకు నీపదంబుల స్మరణం
బెప్పుడు గొలిచెడివాడిల
గొప్పఘనుండన బరంగు గొంకకసాంబా ॥ 87

యెంతటి తపసుండైనను
యెంతటి సుజ్ఞానియైన నిలఱేడైనన్
శాంతు జనకుండుగానీ
శాంతములేనట్టివాడు చవటరసాంబా ॥ 88

అవివేకికి బుధవాక్యము
చెవికెక్కున వేశ్యతనదుచేడియయగునా
కవివాక్కు రిత్తయగు నా
శివశివయనువానిఫలము చెడునాసాంబా ॥ 89

పండితునకు పామరునకు
నుండును భేదంబుచాల నవ్యస్థలిలో
దండియగు నీదుభక్తుల
కుండెనె భేదంబు తరిచివారిచిన సాంబా ॥ 90

అనిలో౯ జారినవాడిల
ననిలేదనువాడు బెక్కుయాశయు గలవా
డును నోర్వలేసివాడును
నినుగొల్వనివాడుధరణి నీచుడుసాంబా ॥ 91

సుత్రామ వినుతగౌరి క
ళత్రాదుష్టాళి చైత్రలక్ష్మీధవు స
న్మిత్రా కోమలగాత్ర ప
విత్రా సుచరిత్ర వేదవేద్యాసాంబా ॥ 92

దండిగనిన్నుభజింప మృ
గండునిపుత్రకుడగాను కన్నకుమారుణ్
ఖండించి విందుసేయ ఘ
నుండగు సిరియాళుబోలనోపనుసాంబా ॥ 93

లోభికి విత్తముగల్గిన
లాభముసుంతైనగలదె లావణ్యులకున్
వైభవములెన్నిగల్గిన
నీభక్తుని కెనయుగలరె నిజముగసాంబా ॥ 94

ప్రమథగణేశ్వర యింద్ర
ప్రముఖామరవినుతపాద వనజమహేశా
హిమకరశేకర శ్రీకర
సుమశరసంహారణ కరుణజూడుముసాంబా ॥ 95

వ్రాసితి విఘ్నముగాకను
వ్రాసితి నీపైని కందపద్య శతకముఁ
జేసితి గైకొను బంగరు
పూసలు మాలికగ మెడనుబూనియు సాంబా ॥ 96

అకటా నరులకు కవితా
మకతల్లిని కృతియొసర్చి మాడలుగొన నొ
ల్లక నీకె కృతియొసర్చితి
ప్రకటితముగ నేను నిత్యభక్తితో సాంబా ॥ 97

కలి నైదువేల ముప్పది
కిలలో శుక్లాఖ్యమందు నీశతకంబుఁ
పొలుపొందగా లిఖించితి
సలలితముగ గొనియు నొసగు సౌఖ్యముసాంబా ॥ 98

ధర నారూ్నలసగోత్రుడ
చిరముట్లురి వంశజుండ శ్రీమహలక్ష్మి
వరతెనయుడ కోటయకవి
వరుడన బరగితని నీదుభక్తిని సాంబా ॥ 99

అనయము నీసాంబశతక
మును జదువుచు వినుచు వ్రాయుబూను నరునికిఁ
ధనకనక వస్తువాహన
మును తనయుల నిత్తువహహా ముదమునసాంబా ॥ 100

